# శ్రీస్తుతి

## అవతారిక:

శ్రీదేశికులు భగవానుని దివ్యపత్నులైన శ్రీదేవి, భూదేవి, నీళాదేవి –అనే ముగ్గురిని శ్రీస్తుతి, భూస్తుతి, నీళాస్తుతి– అనే మూడు స్తుతులతో కీర్తించారు. ఈ ముగ్గురు దేవరులలో,, సదా భగవానుని వక్షఃస్థలంలో వేంచేసి ఉండి, ఆ స్వామిని ఆశ్రయించే భక్తుల విషయంలో పురుషకారాన్ని చేసి, వారు చేసే ప్రపత్తిలో స్వామితోపాటు తానుకూడా వేంచేసి ఉండి, వారు చేసే కైంకర్యాన్ని భగవానునితో పాటు తానుకూడా స్వీకరించే లక్ష్మీదేవిని ఉద్దేశించి ఈ స్తుతి రచింపబడింది. ఇందులో 25. శ్లోకాలున్నాయి. దీనిని అనుసంధిస్తే, సంపద ,సంతానం మొదలైన ఇహలోకఫలాలు కల్గడమే కాక, మోక్షమనే ఫలాన్ని పొందడానికికూడా ఇది సహాయపడుతుంది.



1) మానాతీతప్రథితవిభవాం మఙ్గళం మఙ్గళానాం,

వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యాl

ప్రత్యక్షానుశ్రవికమహిమప్రార్థినీనాం ప్రజానాం

శ్రేయోమూర్తిం శ్రియ మశరణ స్త్వాం శరణ్యాం ప్రపద్యేll

లక్ష్మీదేవీ!

అంతు లేని కీర్తిని కల వైభవాన్ని కలిగినదానవు, మంగళవస్తువులకు మంగళత్వాన్ని కలిగించేదానవు, , మధుసూదనుడనే భగవానుని వక్షస్సు అనే పీఠాన్ని నీ కాంతితో అందాన్ని కలిగించేదానవు, ఇహలోకషపరలోకఫలాలను కోరేవారి శ్రేయస్సు మూర్తీభవించినదానవు, నిన్ను శరణు పొందినవారిని కాపాడేదానవు, శ్రీః అనే పేరును కలిగినదానవు అయిన నిన్ను శరణు పొందుతున్నాను.

2) ఆవిర్భావః కలశజలధా వధ్వరే వా􏰀పి యస్యాః,

స్థానం యస్యా స్సరసిజవనం విష్ణువక్షఃస్థలం వాl

భూమా యస్యాః భువన మఖిలం దేవి! దివ్యం పదం వా,

స్తోకప్రజ్ఞై రనవధిగుణా స్తూయసే సా కథం త్వమ్ ll

నీ అవతారం –పాలకడలిలో, జనకుని యాగశాలలో., నీ నివాసం– తామరపూల వనం, భగవానుని వక్షస్సు, నీ సంపద –ఈ జగత్తు పరమపదం. అటువంటి, , లెక్క లేనన్ని గుణాలను కల నిన్ను అల్పజ్ఞులు ఏ విధంగా స్తుతించగలరు?

3) స్తోతవ్యత్వం దిశతి భవతీ దేహిభిః స్తూయమానా,
తామేవ త్వా మనితరగతిః స్తోతు మాశంసమానః l
సిద్ధారమ్భః సకలభువనశ్లాఘనీయో భవేయం,
సేవాపేక్షా తవ చరణయోః శ్రేయసే కస్య న స్యాత్ ll

నిన్ను స్తుతించేవారికి ఇతరులు వారిని స్తుతించే రీతిలోని వైభవాన్ని కలిగిస్తున్నావు. అటువంటి నిన్ను నేను అనన్యగతినై స్తుతించాలని కోరేవాడనై, నా ఆ ప్రయత్నం ఫలించగా, లోకం అంతా నన్ను పొగడదగినవాడనవుతున్నాను. నీ పాదాలకు కైంకర్యం చేయడంవల్ల ఎవరికి మంచి కలుగదు?

4) యత్సఙ్కల్పాద్భవతి కమలే! యత్ర దేహిన్యమీషాం,
జన్మస్థేమప్రళయరచనా జఙ్గమాజఙ్గమానామ్ l
తత్కల్యాణం కిమపి యమినా మేకలక్ష్యం సమాధౌ,
పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాదలాక్షారసాఙ్కమ్ll

లక్ష్మీదేవీ!జగత్తుయొక్క సృష్టిస్థితిలయాలు దానిని శరీరంగా కల్గిన భగవానుని సంకల్పంవల్ల జరుగుతున్నది. అటువంటి, మంగళరూపుడైన, యోగుల ధ్యానానికి అద్వితీయలక్ష్యంగా ఉండే అంతటా వ్యాపించి ఉండే, అద్భుతమైన ఆ పరమాత్మ అనే తేజస్సు నీ పాదాల పారాణి ముద్రలతో ప్రకాశిస్తున్నది.

5) నిష్ప్రత్యూహం ప్రణయఘటితం దేవి! నిత్యానపాయం,

విష్ణుః త్వం చేత్యనవధిగుణం ద్వన్ద్వ మన్యోన్య లక్ష్యమ్l

శేష శ్చిత్తం విమలమనసాం మౌళయ శ్చ శ్రుతీనాం,

సమ్పద్యన్తే విహరణ విధౌ యస్య శయ్యావిశేషాః ll

లక్ష్మీదేవీ!ళఏ అడ్డు లేని ప్రేమతో ఎల్లప్పుడు కలసి ఉండే, లెక్క లేనన్ని గుణాలను కల నీవు, భగవానుడు –అనే జంట పరస్పరం ఒకరికొకరు నిరూపకంగా ఉన్నారు ఆదిశేషుడు, పవిత్రమైన మనస్సును కల యోగుల హృదయాలు, వేదాంతాలు అనేవి. –మీరిద్దరు ఉల్లాసంగా విశ్రమించే స్థానాలు.

6) ఉద్దేశ్యత్వం జనని! భజతో రుజ్ఝితోపాధిగన్ధం,

ప్రత్యగ్రూపే హవిషి యువయో రేకరూపత్వయోగాత్l

పద్మే! పత్యు స్తవ చ నిగమై ర్నిత్యషమన్విష్యమాణో,

నావచ్ఛేదం భజతి మహిమా నర్తయన్మానసం నఃll

తల్లీ!లక్ష్మీదేవీ!జీవాత్మ అనే హవిస్సుకు ఏకారణం లేకుండా ఉద్దిష్టమైన, సహజమైన దైవం – నీవు, భగవానుడు అనే మీ ఇద్దరు. నీతో కలసి ఉండే భగవానునకే ఆత్మ అనే హవిస్సు సమర్పింప బడుతున్నది. అందువల్ల మీరిద్దరు ఏకశేషిత్వాన్ని –ఒకే విధమైన శేషిత్వాన్ని– కలిగి ఉన్నారు. కనుక, నాయకుడైన భగవానునకు, నీకు కల గొప్పతనాన్ని వేదాలు సదా అన్వేషిస్తున్నాయి. ఆ మీ మహిమ మా మనస్సులను అంతు లేని ఆనందాన్ని పొందిస్తున్నది

.

7) పశ్యన్తీషు శ్రుతిషు పరితః సూరిబృన్దేన సార్థం,

మధ్యే కృత్య త్రిగుణఫలకం నిర్మితస్థాన భేదమ్ l

విశ్వాధీశ ప్రణయిని సదా విభ్రమ ద్యూతవృత్తౌ,

బ్రహ్మేశాద్యా దధతి యువయో రక్ష శార ప్రచారమ్ll

సర్వేశ్వరునకు మిక్కిలి ప్రియమైన లక్ష్మీదేవీ! వేదాలు, నిత్యసూరుల సమూహాలతో కలసి నాలుగు వైపుల సదా చూస్తూ ఉండగా సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలను కల ప్రకృతి అనే పలకలో వేర్వేరు గడులను గీచి, ఆ పలకను మధ్యలో పెట్టుకొని నీవు, భగవానుడు చదరంగం ఆటను ఆడుతున్నారు. అందులో బ్రహ్మ,

శివుడు మొదలైన దేవతలు పాచికలకు అనుగుణంగా మీరు నడిపే పావులుగా అవుతున్నారు.

8) అస్యేశానా త్వమసి జగతః సంశ్రయన్తీ ముకున్దం,
లక్ష్మీః పద్మా జలధి తనయా విష్ణుపత్నీన్దిరేతిl
యన్నామాని శ్రుతిపరిపణాన్యేవమావర్తయన్తో,
నావర్తన్తే దురితపవన ప్రేరితే జన్మచక్రే ll

లక్ష్మి, పద్మ, క్షీరసాగరకన్య, విష్ణుపత్ని, ఇందిర ఆని ఈ విధంగా వేదాలకు మూలధనంగా ఉండేనీ ఈ నామాలను మనసులో భక్తితో ద్రవిస్తూ పాడేవారు పాపాలనే పెను గాలిచే ప్రేరేపింప బడినవారై, జన్మచక్రంలో ప్రవేశించరు. ఇటువంటి వైభవాన్ని కల నీవు భగవానుని ఆశ్రయించి, ఈ జగత్తుకు ఈశ్వరి అయినావు.

9) త్వా మేవాహుః కతిచిదపరే త్వత్ప్రియం లోకనాథం,
కిం తై రన్తః కలహ మలినైః కిఞ్చిదుత్తీర్య మగ్నైః l
త్వత్సమ్ప్రీత్యై విహరతి హరౌ సమ్ముఖీనాం శ్రుతీనాం,
భావారూఢౌ భగవతి యువాం దైవతం దమ్పతీ నః ll

లక్ష్మీదేవీ! కొందరు నిన్ను ఈ జగత్తుకు నాయకివి అంటారు. మరికొందరు నీ నాయకుడైన భగవానుడు ఈ లోకానికి నాయకుడని అంటారు. ఈ రెండు వర్గాలవారు పరస్పరం వాదించుకొని మనస్సులో కాలుష్యాన్ని పొంది, కొంత గెలిచి, కొంత ఓడి,, కొంతసేపటికి తమ వాదాలను విరమిస్తున్నారు. ఇటువంటివారివల్ల ఏమి ప్రయోజనం? నీ ఆనందంకోసం లీలలను చేసే భగవానుని కీర్తించే వేదాల అభిప్రాయానుసారంగా, దంపతులైన మీ ఇద్దరు మాకు పరదైవం.

10) ఆపన్నార్తి ప్రశమనవిధౌ బద్ధదీక్ష స్య విష్ణోః,
ఆచఖ్యుస్త్వాం ప్రియసహచరీ మైకమత్యోపపన్నామ్l
ప్రాదుర్భావై రపి సమతనుః ప్రాధ్వ మన్వీయసే త్వం,
దూరోక్షిప్తై రివ మధురతా దుగ్ధరాశే స్తరజ్గైః ll

ఆపన్నుల ఆపదలను తీర్చడమే వ్రతంగా కల భగవానునకు నీవు ప్రియపత్నివి, అతనితో ఐకమత్యాన్ని కలిగినదానవు– అని వేదాలు పలుకుతున్నాయి. దూరంగా వీచిన పాలసముద్రంలోని కెరటాలవల్ల ఏర్పడే మాధుర్యంవలె నీవు భగవానుని అవతారాలకుకూడా తగిన రూపాలను కలదానవై, అతనితో ఐకమత్యాన్పి కలిగి ఉన్నావు

.

11) ధత్తే శోభాం హరిమరకతే తావకీ మూర్తి రాద్యా,

తన్వీ తుఙ్గ స్తనభరనతా తప్త జామ్బూనదాభా।

యస్యాం గచ్ఛన్త్యుదయవిలయై ర్నిత్య మానన్దసిన్ధౌ,

ఇచ్ఛావేగోల్లసితలహరీ విభ్రమం వ్యక్తయ స్తే ॥

కాచిన బంగారంవంటి రంగును కలిగినది, ఉన్నతమైన వక్షోజాల భారంతో కొంచెం వంగి ఉన్నది, సుకుమారమైనది, నీ అవతార సమయంలోని మొదటి రూపం మరకతమణివంటి భగవానుని మేనిలో ఎల్లప్పుడు శోభను కలిగిస్తున్నది. ఆనందసముద్రంవంటి ఆ తిరుమేనిలో నీ అవతారాలు వాటి ప్రాదుర్భావాలతో, అస్తమయాలతో (వాయువువంటి)సంకల్పంలోని వేగంతో పైకి లేచే అలలవలె ప్రకాశిస్తున్నాయి.

12) ఆసంసారం వితత మఖిలం వాఙ్మయం యద్విభూతిః,

యద్భ్రూభఙ్గాత్కుసుమధనుషః కిఙ్కరో మేరుధన్వా।

యస్యాం నిత్యం నయనశతకై రేకలక్ష్యో మహేన్ద్రః,

పద్మే! తాసాం పరిణతిరసౌ భావలేశై స్త్వదీయైః॥

లక్ష్మీదేవీ! జన్మమొదలు లోకంలో అంతట వ్యాపించి ఉండే వాఙ్మయం అంతా ఏ సరస్వతి అధీనంలో ఉన్నదో, మేరువును విల్లుగా కల శివుడు ఎవరి కనుబొమల కారణంగా మన్మథునకు అధీనుడయ్యాడో, దేవేంద్రుడు సదా ఏ ఇంద్రాణిని తన

వేయి కన్నులకు లక్ష్యంగా కలిగి ఉన్నాడో –ఆ దేవేరులకు అందరికి ఇటువంటి పరిణతి నీ సంకల్పంలోని అల్పభాగంవల్ల కలిగింది.

13) అగ్రే భర్తుః సరసిజమయే భద్రపీఠే నిషణ్ణామ్,
అమ్భోరాశే రధిగతసుధా సమ్ప్లవా దుత్థితాం త్వామ్l
పుష్పాసారస్థగితభువనైః పుష్కలావర్తకాద్యైః,
క్లప్తారమ్భాః కనకకలశై రభ్యషిఞ్చన్ గజేన్ద్రాః ll

నీవు పాలసముద్రంనుండి ఆవిర్భవించినపుడు గొప్ప ఏనుగులు, అమృతం పుట్టిన సముద్రంనుండి ఆవిర్భవించి, భర్త అయిన విష్ణువు ఎదుట తామరపూవు అనే సింహాసనంలో వేంచేసి ఉండే నిన్ను బంగారు కలశాలతో పుష్పవర్షంవంటి నీటి ధారలను కురిపించి నిన్ను అభిషేకించాయి. ఆ ధారలు లోకాలను ఆచ్ఛాదించిన పుష్కలా వర్తకమేఘాల ప్రవాహాలవలె ఉన్నాయి.

14) ఆలోక్య త్వా మమృతసహజే! విష్ణువక్షఃస్థలస్థాం,
శాపాక్రాన్తాః శరణ మగమ న్సావరోధాః సురేన్ద్రాః l
లబ్ధ్వా భూయ స్త్రిభువన మిదం లక్షితం త్వత్కటాక్షైః,
సర్వాకార స్థిరసముదయాం సమ్పదం నిర్విశన్తి ll

అమృతంతో పాటు ఆవిర్భవించిన లక్ష్మీదేవీ!దుర్వాసముని ఇచ్చిన శాపంవల్ల బాధను పొందినవారు, తమ పత్నులతో కూడినవారైన గొప్ప దేవతలు భగవానుని వక్షస్సులో వేంచేసి ఉండే నిన్ను సేవించి, శరణు పొందారు. నీవు నీ కటాక్షాలతో చల్లగా చూచిన ఈ మూడు లోకాలు మళ్ళీ చిగురించి, వృద్ధి చెంది, ఐశ్వర్యాన్ని అనుభవిస్తున్నవి.

15) ఆర్తత్రాణవ్రతిభి రమృతాసారనీలామ్బువాహైః,

అమ్భోజానా ముషసి మిషతా మన్తరఙ్గై రపాఙ్గైఃl

యస్యాం యస్యాం దిశి విహరతే దేవి! దృష్టి స్త్వదీయా,

తస్యాం తస్యా మహమహమికాం తన్వతే సమ్పదోఘాఃll

శ్రీదేవీ!శఆర్తిని పొందినవారిని రక్షించడమే వ్రతంగా కలిగినవి, అమృతాన్ని స్రవించే చెరకువంటివి, ఉదయకాలంలో వికసించే తామరపూల(తో సన్నిహితమైన స్నేహాన్ని కలిగినవి) వంటివి అయిన నీ కటాక్షాలు ఏ యే దిశలలో ప్రసరిస్తున్నవో, ఆ యా దిక్కులలో సంపదల ప్రవాహాలు నేను ముందు, నేను ముందు –అని పోటీ పడుతూ ప్రవహిస్తున్నాయి.

16) యోగారమ్భత్వరితమనసో యుష్మదైకాన్త్య యుక్తం,

ధర్మ్యం ప్రాప్తుం ప్రథమ మిహ యే ధారయన్తే ధనాయామ్l

తేషాం భూమే ర్ధనపతిగృహే దమ్బరా దమ్బుధే ర్వా,

ధారా నిర్యాన్త్యధిక మధికం వాఞ్ఛితానాం వసూనామ్ll

ఈ లోకంలో ఎవరు యోగాలను ఆరంభించాలనే మనస్సును కలవారై, మిమ్ములను ఇద్దరిని మాత్రమే ఆలంబనంగా కల యాగాదిధర్మాలను చేయడానికి అవసరమైన ధనాన్ని సంపాదించాలని అనుకొంటున్నారో, వారికి భూమిలోనుండి కాని, కుబేరుని భవనంనుండి కాని, ఆకాశంనుండి కాని., సముద్రంనుండి కాని –ఎక్కడనుండి అయినా వారు కోరిన సంపత్ ప్రవాహాలు మిక్కిలిగా వెలువడుతున్నాయి.

17) శ్రేయస్కామాః కమలనిలయే! చిత్ర మామ్నాయవాచాం,

చూడాపీడం తవ పదయుగం చేతసా ధారయన్తః l

ఛత్రచ్ఛాయాసుభగశిరస శ్చామరస్మేరపార్శ్వాః,

శ్లాఘాశబ్దశ్రవణముదితాః స్రగ్విణః సఞ్చరన్తి ll

పద్మంలో నివసించే లక్ష్మీదేవీ! గొప్ప శ్రేయస్సును పొందాలని కోరుకొనేవారు వేదాంతాలకు గొప్ప అలంకారమైన నీ చరణాల జంటను మనస్సులో ధ్యానించి, తత్ఫలంగా అధికారఛత్రం నీడలో సాగే గొప్ప అధికారాన్ని తెలిపే కిరీటాన్ని ధరించినవారై, రెండు వైపుల పరిచారికలచే చామరాలతో సేవింపబడేవారై, పూల

మాలికలను అలంకరించుకొన్నవారై, తమ పొగడ్తలను విన్నందువల్ల ఆనందాన్ని పొందేవారై సంచరిస్తారు

.

18) ఊరీకర్తుం కుశల మఖిలం జేతు మాదీ నరాతీన్,

దూరీకర్తుం దురిత నివహం త్యక్తు మాద్యా మవిద్యామ్।

అమ్బస్తమ్బావధికజననగ్రామసీమాన్తరేఖామ్

ఆలమ్బన్తే విమలమనసో విష్ణుకాన్తే! దయాం తే॥

భగవానునకు ప్రియపత్నివి అయిన తల్లీ!లక్ష్మీదేవీ! పవిత్రమైన మనస్సును కలవారు. సకలశ్రేయస్సును పొందడంకోసం, చిరకాలంగా ఉండే శత్రువులను జయించడంకోసం, పాపాలను పోగొట్టుకోవడంకోసం, అనాది అయిన ప్రకృతిని విడువడంకోసం "తృణపర్యంతంగా ఉండే జన్మల సమూహమనే ఊరు పూర్తి అయినది "అని తెలిపే రేఖ అయిన నీ కరుణను ఆశ్రయిస్తున్నారు.

19) జాతాకాంక్షా జనని యువయో రేకసేవాధికారే

మాయాలీఢం విభవ మఖిలం మన్యమానా స్తృణాయ ।

ప్రీత్యై విష్ణో స్తవ చ కృతినః ప్రీతిమన్తో భజన్తే,

వేలాభఙ్గ ప్రశమనఫలం వైదికం ధర్మ సేతుమ్॥

పుణ్యాశాలురు నీవు, భగవానుడనే మీ ఇద్దరి చేరికలోనే కైంకర్యాన్ని చేయడమనే ఫలాన్ని పొందడంలో ఆశను కలవారై, ప్రకృతిసంబంధాన్ని కల సమస్తమైన సంపదను తృణంగా తలచినవారై, నీయొక్క భగవానునియొక్క ఆనందంకోసం అవధిని దాటకపోవడమనేదానిని ఫలంగా కలిగిన, , వేదాలచే విధింపబడిన ధర్మమనే సేతువును ప్రితితో ఆశ్రయిస్తున్నారు.

20) సేవే దేవి! త్రిదశమహిళా మౌళిమాలార్చితం తే,

సిద్ధిక్షేత్రం శమితవిపదాం సమ్పదాం పాదపద్మమ్।

యస్మి న్నీషన్నమితశిరసో యాపయిత్వా శరీరం

వర్తిష్యన్తే వితమసి పదే వాసుదేవస్య ధన్యాః ll

లక్ష్మీదేవీ!దేవకాంతల శిరస్సులలోని మాలికలచే అర్చింపబడినది, ఆపదలు కలిగించని సంపదలు ఫలించే చోటు అయిన నీ చరణపద్మాన్ని నమస్కరిస్తున్నాను. ఆ చరణంలో కొంచెం తలవంచిన పుణ్యాశాలురు, ఈ శరీరాన్ని గడపి, , తరవాత ప్రకృతిసంబంధం లేని, భగవానుని స్థానమైన వైకుంఠాన్ని పొందుతారు.

21) సానుప్రాస ప్రకటిత దయై స్సాన్ద్రవాత్సల్య దిగ్ధైః,

అమ్బ! స్నిగ్ధై రమృతలహరీలబ్ధసబ్రహ్మచర్యైః।

ఘర్మే తాపత్రయ విరచితే గాఢతప్తం క్షణం మామ్,

ఆకిఞ్చన్య గ్లపితమనఘై రార్ద్రయేథాః కటాక్షైఃll

మాటి మాటికి వ్యక్తం చేయబడిన కరుణను కలిగినవై, గాఢమైన వాత్సల్యంతో నిండినవై, , ప్రీతిని కలిగినవై, పాపాన్ని పోగొట్టేవై, అమృత ప్రవాహాలవంటివైన నీ కటాక్షాతో మూడు విధాలైన తాపాలవల్ల కలిగిన వేడిమిలో చాలా తపింపబడేవాడనై, ఏ గతి లేనందున వాడిపోయినవాడనై ఉండే నన్ను ఒక క్షణం చల్లబరచు.

22) సమ్పద్యన్తే భవభయతమీ భానవ స్త్వత్ప్రసాదాత్,

భావా స్సర్వే భగవతి హరౌ భక్తి ముద్వేలయన్తఃl

యాచే కిం త్వా మహ మిహ యతః శీతలోదారశీలా,

భూయోభూయో దిశసి మహతాం మఙ్గళానాం ప్రబన్ధాన్ll

గుణపూర్ణవు అయిన లక్ష్మీదేవీ! సంసార భయమనే రాత్రికి సూర్యులవంటి అన్ని మనోభావాలు నీ అనుగ్రహంవల్ల నాకు భగవంతునిపట్ల భక్తిని మిక్కిలిగా కలిగిస్తున్నాయి. ఇక, నేను నిన్ను ఏమి యాచించను?ఎందుకంటే, చల్లని, గొప్ప స్వభావాన్ని కల నీవు చాలా గొప్ప శుభాల పరంపరలను మాటి మాటికి నాకు ఇస్తున్నావు.

23) మాతా దేవి! త్వమసి భగవాన్ వాసుదేవః పితా మే,

జాత స్సో□హం జనని! యువయో రేకలక్ష్యం దయాయాః l

దత్తో యుష్మత్పరిజనతయా దేశికై రప్యత స్త్వం,

కిం తే భూయః ప్రియ మితి కిల స్మేరవక్త్రా విభాసిll

లక్ష్మీదేవీ! నీవు నాకు తల్లివి. కల్యాణగుణపూర్ణుడైన భగవానుడు తండ్రి. తల్లీ! షఅటువంటి అదృష్టాన్ని కల నేను మీ. ఇద్దరి దయకు ముఖ్యపాత్రంగా అయ్యాను. ఆచార్యులచే మీ ఇద్దరికి దాసుడనుగా చేయబడ్డాను. అందువల్ల, "ఇంకా l నీవు కోరేది ఏమి ?" అనే భావంతో కదా నీవు నీ ముఖంలో చిరునవ్వుతో వెలుగుతున్నావు!

24) కల్యాణానా మవికలనిధిః కా□పి కారుణ్యసీమా

నిత్యామోదా నిగమవచసాం మౌళిమన్దారమాలాl

సమ్పద్దివ్యామధువిజయినః సన్నిధత్తాం సదా మే,

సైషా దేవీ సకలభువనప్రార్థనా కామధేనుఃll

మంగళాలకు ఏ. లోటు లేని స్థానమై, దయకు పరమావధియై, ఏ నాడూ పరిమళం మారని (నిత్యమైన)వేదాంతాలకు మందారపూల మలికయై, మధుసూదనుని గొప్ప సంపదయై, లోకాలకు అన్నిటికి అభీష్టాలను ఇచ్చే కామధేనువైన, గొప్ప వైలక్షణ్యాన్ని కల ఈ లక్ష్మీదేవి సదా నాకు తన సన్నిధానాన్ని ప్రసాదించాలి.

25) ఉపచిత గురుభక్తే రుత్థితాం వేఙ్కటేశాత్,

కలికలుషనివృత్త్యై కల్ప్యమానం ప్రజానామ్l

సరసిజనిలయాయాః స్తోత్ర మేతత్పఠన్తః,

సకలకుశల సీమాః సార్వభౌమాః భవన్తిll

గొప్పగా అభివృద్ధి అయిన భక్తిని కల వేదాంతదేశికులనే వేంకటేశకవి రచించినది, జనులకు కలియుగంవల్ల కలిగిన దోషాలను తీర్చగలిగినది, తామరపూవును నివాసంగా కలిగినది అయిన లక్ష్మినిగూర్చిన ఈ స్తుతిని చదివేవారు అన్ని శుభాలకు పరమావధి అయిన చక్రవర్తిత్వాన్ని పొందగలరు.

శ్రీస్తుతి సంపూర్ణమ్